# విజయశ్రీ

జంధ్యాల పాపయ్య శాస్త్రి
"కరుణశ్రీ"

కరుణశ్రీ కావ్యమాల
గుంటూరు

# ప్రస్తావన

ఎన్ని మారులు చదివినా తనివితీరని గ్రంథం మహాభారతం. చదివిన కొద్దీ చవులూరించే వీరభారత గాథ అది. అది కేవలం కౌరవ పాండవ ఇతిహాసమే కాదు; ధర్మశాస్త్రమూ, నీతిశాస్త్రమూకూడాను. ఆంధ్రమహాభారత రచయితలలో ప్రప్రథముడైన నన్నయభట్టారకుడే చెప్పాడు, ఏమనంటే—

ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రం బని, యధ్యాత్మ విదులు వేదాంతమనియు,
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని, కవివృషభులు మహా కావ్య మనియు,
లాక్షణికులు సర్వలక్షణం బనియును, నైతిహాసికు లితిహాస మనియు,
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని మహిఁగొనియాడుచుండ
వివిధ వేద తత్త్వవేది, వేదవ్యాసు, డాదిముని, పరాశరాత్మజుండు,
విశ్వసన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు.

అని, అందువల్ల మహాభారతం ఒక విజ్ఞానకోశమే. అది తెలుగులోనికి పరివర్తన అయిన నాటినుంచి నేటివరకు తెలుగువారి కది ఒక ధార్మికదర్శనం; నీతిముక్తావళి; తత్త్వశాస్త్రం. ఆంధ్రమహాభారతమే ఆంధ్రజాతి సభ్యతకు పునాదులు వేసిందంటే అతిశయోక్తి కాదు. ఆంధ్రసంస్కృతికి ఆంధ్రమహాభారతము ప్రధానప్రాతిపదిక. భాగవతం మినహాయిస్తే ఆంధ్రదేశం అంతటిలోనూ రామాయణానికంటె కూడా మహాభారతానికే ఆదర ప్రచారాలు ఎక్కువ. భారత భాగవతాలలో కూడా దేనికి దేశంలో మొగ్గో చెప్పడం కష్టమే. భారతం పురాణం చెప్పించడం ఆంధ్రదేశంలో ఇప్పటికీ ఉంది. తెలుగువారిలో భారతం ఇంటి పేరు గలవారు కూడా ఉన్నారు. అది

పారుషసామమే. భారతం పురాణం చెప్పడంలోనో, మహాభారత రహస్యాలు వివరించి వ్యాఖ్యానించడంలోనో వారికిగల ప్రజ్ఞనుబట్టే ఆ యింటి పేరు కలిగివుంటుంది.

ఆంధ్ర మహాభారత ప్రభావం ఇప్పటికీ తెలుగువారిమీద సంసె పోనూలేదు; తగ్గనూలేదు. ఇప్పటికీ మహాభారతగాథ అనేకులను ఉత్సాహపూరితులనూ, ఉద్వేగపూరితులనూ చేస్తూనేవుంది. భారతగాథలు కథలుగా, రచనలుగా, నాటకాలుగా, నాటికలుగా, హరికథలుగా, పాటలుగా రచింపబడి తెలుగుదేశంలో నేటికీ ముమ్మరంగా ప్రచారంలో వున్నాయి. చదువు వచ్చినవారికే కాకుండా చదువు రానివారికికూడా, స్త్రీ పురుషులలో వృద్ధులకు, యువకులకు, బాలబాలికలకుకూడా కౌరవ పాండవ గాథ తెలుసు. ఈ మహాభారత గాథ తోడి పరిచయం చదువుకొన్న వారికే కాకుండా చదువురానివారికి కూడా ధర్మరహస్యాలు తెలియజెప్పి వారి జీవితాలను చక్కదిద్దింది. తెలుగువారిలో ధర్మరాజు ధర్మపరాయణత, భీముడు వేగిరపాటు, అర్జునుడి చురుకుపాటు, నకుల సహదేవుల ఉద్వేగము, శ్రీకృష్ణుడి నీతికౌశలము ఎందరెందరిని ఆశ్చర్య, ఉద్రేక, ఉత్సాహపూరితులను చేసినవో; పాంచాలి పడిన భంగపాటు, కౌరవుల దుస్తంత్రాలు ఎందరెందరిని విచార క్రోధావేశ పరులను చేసినవో !

మహాభారతగాథ అంతా మన వృత్తమే; మానవ ఇతిహాసమే. రాజ్యం పంపకం కోసం పాళ్ళుతెగక పోరాడుకొన్న రాచబిడ్డలు అన్నదమ్ముల కలహం. నేటికీ భారతవృత్తం మనకు సజీవ గాథే. కొన్ని సందర్భాలలో అర్జునుడు నివాత కవచ సంహారంచేసి ఇంద్రుడికి హితముకూర్చి అమరావతికి వెళ్ళి అతడి అర్ధాసనం అధిష్ఠించడం, శ్రీకృష్ణుడు విశ్వరూపం దాల్చడం

వంటి ఆప్రాకృత, దివ్యచర్యలు చేసినట్టు మహాభారతంలో చెప్పివున్నప్ప టికీ, మొత్తంమీద కౌరవులు పాండవులుకూడా రాగద్వేషాలకూ, క్రోధ మోహ భయ లోభ మద మాత్సర్యాలకూ లోనై మనలాగే ప్రవర్తించిన వట్టిప్రాకృతులే. నేటికీ మన కుటుంబాలలో భీములూ వున్నారు; దుర్యోధ నులూ వున్నారు. మన రాజకీయాలలో మన కుటుంబాలలో సంభవించే కలహాలలో కౌరవపాండవగాథల ఛాయలు, చమత్కారాలూ కనబడుతాయి.

మహాభారతగాథ అంతటిలోను ఉద్యోగపర్వంలో శ్రీకృష్ణరాయ బార ఘట్టం హృద్యాతి హృద్యమై మన మనస్సును ఆనందంతో కదలింప జేస్తుంది. తిక్కన సోమయాజి ఈ రాయబారఘట్టాన్ని రసోల్బణముగా రచించి ఔత్యం నడపడంలో శ్రీకృష్ణుని చాకచక్యము, రాజ్యతంత్రజ్ఞత చాలా చక్కగా చూపించాడు. కౌరవసభలో అధికార దుర్మదాంధత, స్వార్థలాభము, రాజ్యలోభము, గురుజనవాక్య ధిక్కారములవంటి మానవ సహజములైన వికారాలు పైశాచిక నృత్యం చేసిన సందర్భం ఇది. కౌరవ సభకు పాండవుల పంపున తమ కయిదూళ్ళయినా ఇస్తే చాలునని సంధి ప్రయత్నం మీద దూతగా వెడతాడు శ్రీకృష్ణుడు. అయిదూళ్ళు కాదు కదా, సూదిమొన మోపినంత నేలయినా ఇవ్వడానికి నిరాకరించడమే కాకుండా చివరికి దూతను బంధించి చెరబట్టుట కుద్యమించి విఫలీకృత మనోరథులవుతారు సుయోధనాదులు. అంతటితో వారి కండకావరమూ తెలిసి వస్తుంది; సంధిరాయబారమూ భగ్నమవుతుంది. రారాజు ఎంతటి అధి కార గర్వప్రమత్తుడైతేమాత్రం, ఎంతటి బలపరాక్రమ సంపన్నుడైతేమాత్రం సంధిపొసగకపోయిన తరువాత తమకు న్యాయంగా రావలసిన రాజ్యం రాక పోతే రాచపాడీ పోనాడి వూరకుంటారా పౌరుష ప్రతాప మహితులైన పాండునందనులు—రాచబిడ్డలు? సామము చేత చక్కబడని కార్యానికి ఇక

దండమే ప్రయోగం. యుద్ధం తప్పని సరి అయింది. శ్రీకృష్ణ రాయబార ఘట్టంలో తిక్కనసోమయాజి పాత్రావిష్కరణ లోను, రాజ్యతంత్రజ్ఞత లోను చూపిన నేర్పు అద్వితీయమైనది. ఏపాత్ర కాపాత్రకే ఒక విశిష్టత. నిండుసభలో దొరలందరి సమక్షాన అవమానింపబడిన మానవతి పాండుచక్రవర్తికోడలు ద్రౌపది. అందరి పాత్రలు ఒకయెత్తు; ద్రౌపది పాత్ర ఒక యెత్తును. పాండవులు యుద్ధసన్నద్ధులై సంగ్రామ రంగాని కనతరించుచున్నే ఈ చిన్ని కావ్యం "విజయశ్రీ" లోని కథావస్తువు. తిక్కనసోమయాజి రాయబారఘట్టాన్ని వరవడిగా పెట్టుకొని వ్రాసినరసవంతమైన కావ్యమిది.

ఈ "విజయశ్రీ" రచించిన కవి "కరుణశ్రీ" అనే గుప్త నామము ధరించిన శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు. వీరు ఇదివరకే చాలా కావ్యాలు వ్రాసి పేరు పొందారు. వీరి ఖండ కావ్య సంపుటి "ఉదయశ్రీ" తెలుగునాటిని అలరించి, తెలుగుహృదయాన్ని ఆనంద వీచికలలో ఉయ్యాల లూగించింది. "ఉదయశ్రీ"కి సమానస్కంధము వీరి "అరుణకిరణాలు." "అరుణకిరణాల" ప్రాతశ్శోభలో పరువులు పెడుతూ బయలుదేరింది వీరి "కరుణామయి." పాటల పాపాయి "కరుణామయి."

"విజయశ్రీ" వీరి నూతన కావ్యం. పాండవులు యుద్ధానికి సన్నద్ధు లవడం ఈ కావ్యానికి వస్తువు. ఏమంత గొప్పవిషయమిది కావ్యవస్తువుగా స్వీకరించడానికి ? అయితేమాత్రమేమి, కవి సొన్నారి. వస్తు వెంతటి సామాన్యమైన దయితే నేమి, అతని చేతిలో దానికెక్కడలేని తీరూపు వస్తుంది. అందులో చాలా ఘటికుడు ఈ సొన్నారి "కరుణశ్రీ" నామాంచితుడు పాపయ్యశాస్త్రి. ఈ కవి ఈ యలంతి విషయాన్ని చేపట్టి చదివినకొద్దీ చవులూరించి హృదయాన్ని రంజింపజేసే భవ్యమైన దివ్య కావ్యముగా వెల

యించినా విన్యాణము తో అద్భుతమైనశిల్పము చూపి మంత్రాలోచనం స్కంధావారం, విషాదం, ప్రబోధం, విజృంభణం అనే అయిదు చక్కని చిక్కని రేకులుగా మలిచి సుమనో మనోజ్ఞముగా ఈ దివ్యకావ్యకల్ప ప్రసూనమును రచించారు శ్రీ శాస్త్రిగారు. గణాలంకారాది కావ్య విభూతిని సంతరించుకొని ఈ రసవత్కావ్యం ఆవిర్భవించింది. నేడు ప్రకటితము లవుతున్న నవ్యాంధ్ర కావ్యకుసుమాలలో విశిష్టతగల చక్కని మధు రసార్ద్ర సుమ మిది. ఇందులో అచ్చటచ్చట ఒకటి రెండు దోషము లున్నప్పటికి దోషజ్ఞులే కాని కావ్యరసాస్వాదనులైన రసికవతంసులు వాటిని పాటింపరు. ఈ కావ్యానికి ఈడువచ్చే ఖండకావ్యాలు తెలుగులో ఎన్నో లేవంటే అది అతిశయోక్తికాదు. అసలే ఇది భారతవీరకుమారగాథ, సువర్ణాంచితమైనది; అందులోను శ్రీ పాపయ్యశాస్త్రిగారు కడు నేర్పుతో ఈ కావ్యాన్ని నిర్మల గంగాప్రవాహమువలె అచ్ఛస్వచ్ఛము, మధురము, ఉద్గమనవేగాటోపము గల తమకు సహజమగు లలితమనోహరమైన చక్కని శైలిలో రచించారు. ద్రాక్షాపాకములో పడిన యిది యే సహృదయ హృదయాహ్లాదము కలిగింపదు? ఏ రసలుబ్ధుల కిది ఆస్వాద్యమై సుసేవ్యము కాదు? విశేష మేమంటే, ఇందలి ఖండము లన్నీ పండిత పామరుల నొక్క రీతిని అలరించే రసఘుటికలు.

ఈ కావ్యం చదివీ చదవగానే మన మనసుకు తట్టేది కవనమల్లుటలో కవికి గల చాతుర్యము. ప్రసన్న కథాకలితార్థ యుక్తిగల పదాలు ఏర్చి కవి రసజ్ఞుల కంజలిబట్టి గిలకరించి యిట్టే విక్షేపింపగా అవి తమకు తామై ఛందస్సూత్రములో కూర్పువడి, వృత్తాలుగా గీతికలుగా రూపొంది నట్టుంటాయి ఇందలి పద్యాలు. కాకపోతే ఏమి టీ క్రింది పద్యం చూడండి.

ఇమ్మన్నా డయిదూళ్లు భీష్ముడు; గురుం డేదో విధిన్ సంధి కా
నిమ్మన్నాడు; విచిత్రవీర్యతనయుం డేలా విరోధమ్ము పో
నిమ్మన్నా; డటు మీద కర్ణుని మొగ మ్మీక్షించి పొం డేమి పో
పొమ్మన్నాడు సుయోధనుం డనుగుతమ్ముల్ రొమ్ము లుబ్బింపగన్.

ఇందులో భావం పదాల నేవిధంగా ఆకట్టుతూ తరుముకుపోయిందో! ఛందోవృత్తంలో పదాలు తమ స్థానాలలో అశ్రమముగా వెదకుకొంటూ వచ్చి నిలిచాయి. ప్రతి పద్యములోని భావమూ కొండ కోనలోనుండి వెలువడే ఒక సెలయేటిలాగ తన త్రోవ తాను అప్రయత్నముగాను, సుకరముగాను, మలచుకొంటూ పోయింది. ఏ గణ యతిప్రాసలూ గాని గతి కడ్డురావు సరికదా దాని కలంకారప్రాయమే అవుతాయి. అవి వేని కవే ఒత్తిడికి త్రోవయిచ్చి భావాన్ని లోగొని ఒండొంటితో సమైక్యమై హృద్యతను భజించాయి. కావ్యములోని ప్రతి పద్యమూ ఇదే రీతి. కావ్యమంతా కథనరీతిలో నట్టులేకుండా ఉద్వేగముతో ఊరవడితో నడచిపోయింది.

ఈ కావ్యంలోని మరో గొప్పగుణం ఏమంటే, నిఘంటువులలోని మారు మూలపదాలు వెదకిపట్టి వేయకుండా మనం సామాన్యంగా మాట్లాడుకొనే మామూలు మాటలతోనే రసం ఉట్టిపడేటట్టు శక్తిమహిత మైన గొప్ప కవిత్వం చెప్పడం ఈ కవికి సహజంగా అలవడ్డ ప్రజ్ఞ. అన్నిశబ్దాలు మనకు పరిచయ మైనవే, నిత్యవ్యవహారంలో వున్నవే, తేలికవే. భావాన్ని ఎంత స్ఫూర్తితో బలంగా మలిచి మూర్తిమంతం చేస్తున్నారో చూడండి—

అడుది యేడ్చి తెచ్చుకొనినట్టి దయారస ధర్మ భిక్షకై
గూడలు క్రుంగి కుంతికొడుకుల్ చెయి చాచుట యెగ్గు సిగ్గులన్
వీడుట కాదె? దేహి యని వేడుదురే పగవారి? నే డిటుల్
బూడిద పాలొనర్చితిమిపో అమృతాంశుకులప్రతిష్ఠలన్!

లెమ్ము ధనంజయా! విధి బలీయము! న్యాయము గెల్చు; నిల్చు స
త్యమ్ము; నశించు స్వార్థము; సదా యుగధర్మ మిదే గదోయి! క
న్గొ మ్మిక నంత్యకాలమున నూర్వురు బిడ్డల తండ్రికైన పిం
డ మ్మిడు దిక్కు గల్గ దకటా! గ్రహచారము తప్పివచ్చినన్!!

మరోగుణము పద్యాలలోని హృద్యమైన సంభాషణాశైలి. చూడండి ఈ క్రింది పద్యములు—

అంధుడు వృద్ధరాజట! మదాంధుడటే యువరాజు! రాజసం
బంధులు ద్యూతబంధులటె! మంచికి మార్గ మి కెట్లు? గాఢ గ
ర్వాంధ తమ స్తమస్వినుల స్వార్థపిశాచము గజ్జె గట్టగా
సంధిలునయ్య సంధి? కొనసాగునటయ్య నయప్రయత్నముల్?

హింస యొనర్పనంటివి సరే! మము హింసల పాలొనర్చు వి
ధ్వంసక శక్తులందు దయదాల్చుట ధార్మికహింసకాదె? మా
కంసుని జంపి లోకముల కష్టము దీర్పనె? చెల్లునే యసృ
ఙ్మాంసము లెండ తిండికయి మాడుట రాచకొలమ్ము వారికిన్?

ఈవిధంగా ఎన్ని పద్యాలయినా చూపవచ్చును. కావ్యమంతా ఇదే రీతి నున్నప్పుడు వేరే వాటిని ఎత్తి చూపడ మెందుకు?

ఈ కావ్యము వీరరసప్రధానమైనది. అసలు కావ్యరచనకు తీసికొన్న ఘట్టమే అటువంటిది. సంధికార్యము విఫలమైనది. పాండునందనులలో ఒక్క ధర్మరాజు తక్క మిగిలిన వారందరు కౌరవులమీద కారాలు మిరియాలు నూరుతున్నారు. సంధి విఫలమైనా అసలు సామం చేతనే కార్యం సాధించాలనే యత్నంలోవున్న ధర్మరాజు మాత్రం గురుబంధుజనసంహారా

నికి సుముఖుడు కాడు. కాని పరాభవానల దందహ్యమాన మానస పాంచాలి తనపతులను ఉపాలంభించి యుద్ధానికి పురికొల్పుతుంది. కౌరవులరాజ్యమదాంధత, తృష్ణ బాగా తెలిసివచ్చిన కృష్ణుడు కూడా ఇక దండోపాయం తక్క కార్యసాధనానికి వేరే ఉపాయం లేదనే నిశ్చయంలో ఉన్నాడు. చివరి కందరు యుద్ధంచేయడానికే నిశ్చయించి అందుకు తగిన సన్నాహం చేస్తారు. ఈ మంత్రాలోచనఘట్టం రసవంతములైన పద్యాలతో హృద్యంగా ఉంది. ఈఘట్టంలోని పాంచాలిపాత్ర చాలా గొప్పది. ఆమె క్రోధోద్రిక్తఅయి తన పతులను వెగటుగాను వికటంగాను ఎత్తిపొడుస్తూ బరిమీద ఆడుత్రాచు లాగ శౌర్యాగ్ని విస్ఫులింగాలు చిమ్ముతూ బుసలు కొడుతుంది. ఆ సాధ్వి ఆడే ఒక్కొక్క మాటలో సెగలు పొగలతో కాలకూటవిషం గక్కుతూ ఉంటుంది. ఆ విషం సెగకు తాళుకోగలవారెవరు? ఆమె హృదయోద్వేగమూ, ఉద్రేకమూ గమనించండి.

> భుజాగ్రముల్ పొంగ పురోగమింతురో !
> ధ్వజాగ్రముల్ వంగ తిరోగమింతురో !
> శిరమ్ములక్షా దాల్చి పరాక్రమింతురో !
> కరమ్ములక్షా మోడ్చి పరిక్రమింతురో !

ఏమి ఉద్వేగము! ఏమి ఉద్రేకము! సందర్భానుసారముగా ఇక్కడ వృత్తమే మారింది. ఈ పద్యం చిత్రమైనది. అది చదువుతూఉంటే ఆ పాంచాలి హృదయంలోని భావోద్వేగ తరంగాలు ఒకదాని నొకటి తరుముకొనిపోతూ ఉవ్వెత్తుగా లేస్తూ పడుతూ లయబద్ధమైన ద్రుతగతితో సాగిపోతూన్నట్లు స్ఫురిస్తుంది మనకు. ఇదే కళ. కవిచాతుర్యము. చూడండి ఈ యెత్తిపొడుపు ఎంత నిష్ఠురమైనదో-

త్యజింతురో క్షాత్రకుల ప్రతిష్ఠలన్ !
భజింతురో శాత్రవ పాదపద్మముల్ !
భుజింతురో కానల కందమూలముల్ !
సృజింతురో సాత్త్విక ధర్మశాస్త్రముల్ !

ఈ విధంగానే విషాద ఘట్టంలోకూడ కవి వృత్తం మార్చివేశాడు; ముత్యాల సరాలు వాడాడు. సందర్భానుసారంగా ఔచితిని అనుసరించి వృత్తం మారుస్తూ వచ్చిన కవి ప్రతిభను కొనియాడవలసిందే.

పాంచాలి చెప్పిన ఈ క్రింది పద్యము చూడండి ఎంత సొంపుగా ఉన్నదో- ఎంతటి సమయోచితంగా ఉన్నదో –

"భారతవీరమాత" యగు భాగ్యము ప్రాప్తిలు అత్తగారి కం
చూరక చూచి చూడనటు యుంటిమి; ఆమెకు దక్కకున్న ఆ
గౌరవలక్ష్మి లభ్యమగుగాక కుమారుల గన్న మా హిడిం
బా రమణీలలామకు! సుభద్రకు! ఈ ద్రుపదాత్మజాతకున్ !!

ఈ కావ్యంలో చాలా ఉన్నాయి యిటువంటి ముచ్చటైన పద్యాలు. మచ్చుకు ఇదొకటి–

రారా జెవ్వడు రాజ్యమేలగ ? నపార స్ఫార దోస్సార మే
పారన్ రాజుల నాజులన్ గెలిచి, నా డాసేతుశీతాచల
క్ష్మారాజ్యమ్మును పాండురాజు వెలయింపన్, నే డిటుల్ కొల్వసిం
గారమ్మైన కుదుపంగ బుట్టిరి దొరల్ గాంధారి గర్భమ్మునన్ !!

మొత్తం మీద రసగ్రహణపారీణులైన పాఠకులకు ఆనందదాయకమైన కావ్యమిది. కొందరు ఈ కావ్యములోని పద్యాలు ఒకటి రెండు పేలవంగా

వున్నవనీ, జిగి బిగి కొన్నిట తక్కువైనదనీ, పదముల కూర్పులో కొన్నిట మార్పు అభిలషణీయమనీ అంటే అనవచ్చును. కాని దోషజ్ఞుల విమర్శకు గురికాని కవులూ లేరు; కావ్యాలూ లేవు. ఆధునిక కాలంలోగాని, ప్రాచీన కాలంలోగాని, ఏమాత్రమూ దోషాలూ లోపాలూ లేని కావ్యాలు అరుదు. అయితే రసజ్ఞులైనవారు కవిప్రతిభనే, ప్రజ్ఞనే గమనించి రసగ్రహణమే చేస్తారు.

శ్రీ పాపయ్యశాస్త్రిగారు ముందుముందు ఇంకా గొప్ప కావ్యాలు వ్రాసి ఆంధ్రభాషాయోషనలంకరించి యశస్సు సంపాదింతురుగాక అని కోరుతున్నాను.

మల్లంపల్లి సోమశేఖర శర్మ
ఆంధ్ర విశ్వకళా పరిషత్తు.

ప్రియమిత్రుడు సహృదయుడు

## ఆదిపూడి శ్రీకృష్ణమూర్తికి

పచ్చని పంటచేల పయిపై పరువెత్తెడి పైరుగాలితో
ముచ్చటలాడుచున్, హృదయముల్ పులకింపగ, నాడు కోతికొ
మ్మచ్చుల నాడుకొన్న మనమైత్రి క్రమమ్ముగ వృద్ధిజెందుచున్
వచ్చి, హిమాలయాగ్రములపై నిలిపెన్ మన జీవితమ్ములన్!!

చల్లగ—మెల్లగా—కరిగిసాగిన ఈ యమునా ప్రవంతిలో
వెల్లువ గొన్న సౌమనసవేదన రాగము దిద్దుకొన్న ఏ
పిల్లనగ్రోవి మోవి మురిపించెనొ! నీ హృదయంబు నిండు జా
బిల్లివలెన్ ద్రవించి కురిపించిన దీ నవసౌధధీధితుల్!!

ఓయి స్వతంత్రతాప్రియ! మహోదయ! నా "విజయారుణారుణ
శ్రీ" యిది స్వీకరింపుము విశృంఖల హస్తములన్; వినూతన
చ్ఛాయలు దిద్దు నింక మన సౌహృదలక్ష్మికి వీరభారతా
మ్నాయ విరాట్ కిరీట సుషమా సుమనోజ్ఞము లీ ప్రభాతముల్!

# వి జ యో త్స వం

భారతం పాఠం చెప్పేనాడే విజయుడిమీద విశేషమైన ఆదరమూ అభిమానమూ కలిగించారు గురుదేవులు కుప్పా శ్రీ ఆంజనేయ శాస్త్రిగారు.

ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో పనిచేస్తున్న రోజుల్లో ఒకనాడు నాలో ప్రతిధ్వనించిన "ఆత డజాతశత్రుడు మహాత్ముడు శాంత తపస్వి" అన్న హృదయస్పందనాన్ని గుర్తించి ఆరాత్రే "విజయశ్రీ"కి అంకురార్పణ జరిపించారు పూజ్యమిత్రులు నండూరి రామకృష్ణమాచార్య.

ఆనాడు ఆంధ్రవారపత్రికల్లో భారతుల్లో ఆ వ్యాసాల బింకమూ ఆ మీసాల బింకమూ చూచి ఆ సాహితీతపస్వి సౌజన్య సౌహార్దాల కోసం ఉవ్విళ్ళూరేవాడిని. ఈనాడు నా అదృష్టం కొద్దీ ఈ కావ్యానికి సువిస్తరమైన ప్రస్తావన వ్రాసిపెట్టారు ఆ మధురహృదయులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.

అక్కడక్కడా చక్కని సలహా లిచ్చి సముచితమైన సహాయం చేశాడు అభ్యుదయ మిత్రుడు మా "ప్రయాగ".

అనురాగం తోనూ అభిమానం తోనూ ఇచ్చిన ఈ ఉపహారాన్ని హృదయ పూర్వకంగా స్వీకరించాడు ప్రియవయస్యుడు ఎ. యస్. కృష్ణా.

మళ్ళీ ఈ పుస్తకాన్ని కోరినట్లు ముద్దుగా ముచ్చటగా ముద్రించి ఇచ్చారు "జనరల్ ప్రింటర్స్"వారు.

ఈ విజయోత్సవ సమారంభంలో వారందరికీ వందనాలూ అభివందనాలూ అర్పిస్తూ సహృదయులైన సోదరీసోదరుల వీర హస్తాలకు ఈ నా "విజయశ్రీ" అందిస్తున్నాను.

క రు ణ శ్రీ

# విజయశ్రీ

★ మంత్రాలోచనము

★ స్కంధావారము

★ విషాదము

★ ప్రబోధము

★ విజృంభణము

# కురుక్షేత్రం

జీవితమే ఒక చిత్రమైన కురుక్షేత్రం. ఈ రంగంలో ఆస్తికీ నాస్తికీ, శాంతికీ క్రాంతికీ, ధర్మానికీ అధర్మానికీ, న్యాయానికీ అన్యాయానికీ అహరహమూ. సతతమూ—భయంకర సంగ్రామం జరుగుతూనే వుంటుంది.

ఒకప్రక్క స్వాతంత్ర్యాకాంక్ష నాలుకలు చాచుకొని ఆవేశంతో అనర్గళంగా ముందుకు తోసుకువస్తూవుంటే మరో ప్రక్క స్వార్థపరత్వం పాదాలు నాకే సామ్రాజ్యతృష్ణ మేడలుకట్టుకొని, గోడలు పెట్టుకొని తలుపులు బిగించు కూర్చుంటుంది.

అధర్మం ధర్మంమీద విజృంభించింది. రారాజు అత్యాచారాలు ఆరోజుకారోజుకు మేరమీరాయి. కర్రలతో బాదించాడు; కత్తులతో పొడిపించాడు; కాళ్ళు చేతులు బంధించి కారాగారాలలో త్రోయించాడు; అన్నంలో కాలకూటం కలిపించాడు; ఏమరిపాటున కొంపలకు నిప్పు పెట్టించాడు; మసిపూసి మాయ పాచికలు వేసి రాజ్యం కాజేసి పాండవుల్ని అరణ్యాలకు పంపించాడు! పాంచాలిని పరాభవించటంకోసం పైకిలేచిన దుశ్శాసన హస్తాలు పైశాచిక ప్రభుత్వానికి ప్రత్యక్ష నిదర్శనంగా నిలిచిపోయినై.

వనవాసాలు అజ్ఞాతవాసాలు గడిచినై; సంధులూ సంప్రదింపులూ విఫలమైనై; పాండవపరిషత్తు సమావేశమయింది-ఇక ముందు కర్తవ్యం ???

అదిగో-పాంచాలీ కచాంచలాలు రేగుతున్నై-పాంచజన్య దేవదత్తాలు మ్రోగుతున్నై-భీమగదాదండం ప్రతిపక్ష వక్షస్థలాలపై ప్రళయ తాండవం చేస్తున్నది.

అదుగో భారతవీరుడు పార్థుడు గాండీవం ఎక్కుపెడుతున్నాడు. మహాత్ముడు మధుసూదనుడు అశ్వాల్ని అదలిస్తున్నాడు. ఆ జగన్నాథ రథ చక్రాలు ముందుకు పరుగెత్తుకు పోతున్నై.

తప్పదు-ధర్మం జయిస్తుంది-నరుడు విజయుడౌతాడు - "విజయశ్రీ" వీరగీతులతో భారతమాతకు నీరాజనా లెత్తుతుంది.

# మంత్రాలోచనము

శ్రీకృష్ణుడు

ఐనవి సంధిసంబరము, లాయుధముల్ ధరియింపు డయ్యా! దా
పైనది వీర భారత మహా రణరంగము—సర్వథా వృథా
యైనవి సంప్రదింపులు—తథాస్తు—జయాపజయమ్ము లేవి యె
ట్లైనను మీవి వారివి గుణాగుణముల్ గ్రహియింప రందరున్!!

పోయితి మీకు వారికిని పొందు పొసంగు నటంచు—వ్యర్థమై
పోయెను నాశ్రమల్, ముదిరిపోయెను వానికి స్వార్థబుద్ధి—ఏ
మో యొక వాడిసూదిమొన మోపిన నేలయు చేతిమీదుగా
నీయడటే కురుప్రభు; డదెక్కడి రక్కసి రాజ్యకాంక్షయో !!

ఇమ్మన్నా డయిదూళ్ళు భీష్ముడు; గురుం డేదో విధిన్ సంధి కా
నిమ్మన్నాడు; విచిత్రవీర్యతనయుం డేలా విరోధమ్ము పో
నిమ్మన్నా; డరకంట కర్ణునిమొగ మ్మీక్షించి పొందేమి పో
పొమ్మన్నాడు సుయోధనుం డనుగు తమ్ముల్ రొమ్ములుబ్బింపగన్!

సిరులుదొరంగి ఘోరవనసీమల చెట్టుకు పుట్టకొక్కరై
యరిగినవారు మీరు; దొరలై తెకతేరకు తీయగా తినన్
మరగినవారు వా; రలతిమాటలతో ధర యిత్తురయ్య! సం
గరమున ఖడ్గముల్ గదలు గాండివముల్ చెరలాడకుండగన్!

కాలుని దున్నపోతు చిరుగంటల మ్రోతకుగాక సంధి వా
క్యాలకు వీనులొగ్గుదురటయ్య మదాంధులు; గుండెగాలమై
యాలము దాపురించె దొర లందరకున్; కురుచక్రవర్తికిన్
కాలము దాపురించె—కలకాలము నిల్చునె మాయసంపదల్!

బంధింపన్ దలపెట్టినారు—బహుధా ప్రచ్ఛన్నులై వచ్చి ని
ర్బంధింపన్ సమకట్టినారు చెరసాలన్—చాలులే సంధి సం
బంధ మ్మీక్రియ బంధనమ్ములకు త్రోవందీసె—భీమన్నచే
బంధింపంబడుగాక! కృష్ణ కబరీ బంధ మ్మవశ్య మ్మికన్!!

భీముడు

త్రాటం గట్టిరి, నీటనెట్టిరి, విషాక్త మ్మృష్టముం బెట్టి, రే
చేటున్ వాటిలకున్కి కష్టపడి కాశీయాత్ర కంపించి, ర
చ్చోటన్ కొంపకు నిప్పువెట్టి, రడవుల్ చుట్టించి, రీ సాధ్వి కా
పాటుల్ గూర్చిరి, భాగ మీయఁ డని రబ్బా యెంత సౌభ్రాత్రమో !!

అ" యొక వీరభారత కులాంగన కంటి కవోష్ణ బాష్ప బిం
దువులు ధరిత్రిపై గురియు దుర్భర దుస్సహ దుర్దినమ్ము; ల
య్యావి పదిమందిలో ఒక మహాసతి పైటచెరంగుబట్టి ధ
ర్మవు దిగఁద్రావి రక్కసి ప్రభుత్వము లాగిన దుర్ముహూర్తముల్!!

అది పాంచాలి పటాంచలాపహరణమ్మా! కాదు-తత్కౌరవాం
త్య దిన ప్రేత పటాంచలాహరణమే యౌ నూటికి న్నూరు పా-
ళ్ళది వేణీగ్రహణమ్మటే! వికట నృత్య న్మృత్యుకాంతా భయ
ప్రద పాణిగ్రహణమ్ము గాక; భవితవ్యం బెంత దుర్లంఘ్యమో !!

ఆశ్చర్య మ్మవిలంఘ్యమౌ విధికృత మ్మట్లుండె గాబోలు నా
దుశ్చారిత్రులు దుర్వివిదగ్ధులు దురాత్ముల్ దుర్మదగ్రస్తులై
పశ్చాత్తప్తులు గారు నేటికిని; తత్పాపంబు బాపంగ ప్రా
యశ్చిత్త మ్మిక లేదు; మారణమహాయజ్ఞమ్మె కర్తవ్యమౌ!

రారాజెవ్వఁడు రాజ్యమేలఁగ? నపారస్ఫారదోస్సార మే
పారన్ రాజుల నాజులం గెలిచి నా డాసేతుశీతాచల
క్ష్మారాజ్యమ్మును పాండురాజు వెలయింపన్; నేడిటుల్ కొల్వుసిం
గారమ్మై కుడుపంగఁబుట్టిరి దొరల్ గాంధారి గర్భమ్మునన్!!

అబ్ధిప్రావృతమేదినీవలయరాజ్యమ్మెల్ల మాతండ్రిచే
లబ్ధమ్మయ్యెను గ్రుడ్డిరాజునకు; ఏలా నేడు చేజారు నా
లుబ్ధాగ్రేసరచక్రవర్తి? అయిదూళ్ళుం గూడ నీయండు; ప్రా
రబ్ధం బింతకు నెట్టులున్నదొ యుపేంద్రా! వృద్ధజీవాలకున్!

అర్జునుఁడు

దొరల మటంచు రాజసముతో తెగనీలిగి పట్టుపాన్పులన్
బొరలు దినమ్ములన్నియును బోయె; ప్రపంచము మారిపోయె; ము
ష్కరులు కురూద్వహుల్ మనలఁగాదని కన్నులు మూసికొన్న-ఈ
నరుని కఠోర గాండివ నినాదము నిద్దుర మేలుకొల్పెడిన్!

వచ్చుని రాజవంశవని పాడొనరింప జనించినాఁడు కా
ర్చిచ్చయి జేడు-సూతసుతు స్నేహము దానికి తోడు-గాడుపై
కచ్చెలు రేపె నా శకునిగాడు-రగుల్కొనె మంట మింట, వి
వ్వచ్చుని వింట నింక శరవర్షము తప్పదు విశ్వశాంతికై!

ఆ సభయందు రాసభము లట్లు లతాంగిని లాగి కౌరవుల్
సేసిన చేతలున్, కుటిలజిహ్వలు కూసిన కూతలున్, మదిన్
గోసిన కోతలై చెరగకున్నవి; వారికి వారివారికిన్
వ్రాసిన వ్రాతలే యిక ధనంజయు శాత శరప్రఘాతముల్ !

దండము దక్క నొండొక విధానము వారల కింపుగాదు; కో
దండము దక్క కొండొక విధమ్మున కర్జములేదు; మత్త వే
దండము మాడ్కి దివ్యబలధాముడు భీముడు దీప్తిమద్ గదా
దండము ద్రిప్పనప్పుడుగదా కదనాసకు కాలుద్రవ్వుటల్!!

పుట్టినదాది రాజుకొనిపోయిన ద్వేషదవాగ్ని కీలలన్
చిట్టిముగట్టి కౌరవుల శీర్షములన్నియు; తప్పదింక డీ
కొట్టక వారికిన్, చితుకగొట్టక తప్పదు మాకు; సంధి కూ
కొట్టుదురయ్య! మేలిపలుకుల్ చెవిబెట్టుదురయ్య బెట్టిదుల్ !

అంధుడు వృద్ధరాజట! మదాంధుడటే యువరాజు! రాజ సం
బంధులు ద్యూతబంధులటె! మంచికి మార్గ మి కెట్లు? గాఢ గ
ర్వాంధతమ స్తమస్వినుల స్వార్థపిశాచము గజ్జెగట్టగా
సంధిలునయ్య సంధి! కొనసాగునటయ్య నయప్రయత్నముల్ !!

## న కు లు డు

ఘోషయాత్రనాటి కురుకులాభరణంబు
తెలిసికొనడొ పాండవుల బలంబు!
చిత్రసేన కఠిన శృంఖలా సంబద్ధ
హస్త యుగళి గుర్తులయిన లేవొ!

విరటు గోగణంబు మరలించు సమయాన
పార్థువలన వీపు బ్రద్ద లగుట
మరచిపోయిరేమొ కురువీరు; లోకమాటు
తలలు తవుడుకొన్న తలపువచ్చు!!

కుటిల కీటక శత విషచ్ఛటల జిక్కి
కురుకుల లతామతల్లి సుందరత తరిగె!
కుంతికొమరుల ముత్యాల గొడుగునీడ
నేడు మొదలది నవనవలాడుగాక!

కలిత లలితేందు కుల యశోగ్రసన కాంక్ష
కలలుగనుచున్న దా నూరుతలల నాగు;
పడగ పైకెత్తి నెత్తిపై బడకమున్నె
పుడమి బడు వీర నకుల విస్ఫూర్తిలోన.

సహదేవుడు

దోసమొ మోసమో జరిగె ద్యూతము ; గెల్చిరి వారు-దుష్ట దు
శ్శాసన హస్త మెత్తిన నృశంస ప్రభుత్వము ముందు దాసియై
దోసిలియొగ్గి తెచ్చుకొనె ద్రోవది రాజ్యము ; దానికోసమై
చేసిరి రాయబారము లిసీ ! పసచాలని పాండునందనుల్ !!

అడితి మోడిపోయితి మనంత ; అనంత ! అనంతరమ్మునన్
గోడలి కిచ్చె నిచ్చకపు గూరిమి పెంపున గ్రుడ్డిరాజు-ము
న్నోడిన దానినే మరల నోడి, వనుల్ దిరుగాడి, నేడు వా
యోడక భాగమిమ్మనుటయున్-కురువల్లభు డీయకుంటయున్!!

ఆడది యేడ్చి తెచ్చుకొనినట్టి దయారసధర్మభిక్షకై
గూడలు క్రుంగి కుంతికొడుకుల్ చెయిజాచుట యెగ్గుసిగ్గులన్
వీడుట గాదె ? దేహి యని వేడుదురే పగవారి ? నే డిటుల్
బూడిదపా లొనర్చితిమిపో ! యమృతాంశుకులప్రతిష్ఠలన్ !

బావను హస్తినాపురము బంపెడిచో "నిదమిత్థ" మంచు నా
భావములోని భావములు స్పష్టము సేయదలంచియున్, శుభం
భావుక సంధియాత్ర అశుభం బని క్రుంగితి, మిన్నకుంటి, మా
బావ సుఖంబుగా దిరిగివచ్చె నిదే పదివేలు నేటికిన్!

## పాంచాలి

భుజాగ్రముల్ పొంగ పురోగమింతురో!
ధ్వజాగ్రముల్ వంగ తిరోగమింతురో!
శరమ్ములన్ దాల్చి పరాక్రమింతురో!
కరమ్ములన్ మోడ్చి పరిక్రమింతురో!

త్యజింతురో క్షాత్రకుల ప్రతిష్ఠలన్
భజింతురో శాత్రవ పాదపద్మముల్!
భుజింతురో కానల కందమూలముల్!
సృజింతురో తాత్విక ధర్మశాస్త్రముల్!

స్మరింపుడీ ద్యూత సభా ప్రమాణముల్!
ధరింపుడీ చేత ధనుష్ కృపాణముల్!
హరింపుడీ కౌరవ గర్వసంహతుల్!
భరింపుడీ పౌరవ గౌరవద్యుతుల్!

అధిష్ఠితోద్దండ రథిప్రకాండుడౌ
యుధిష్ఠిరుం డెంతటి సార్థకాఖ్యుడో!
అజాతశత్రుత్వ యశోభిలాషలో
స్వజాతి చైతన్యము విస్మరింతురో!

ధ ర్మ రా జు

సంధి యగు ; బాల్యవైర
గ్రంధి దొలగు ; లోకశాంతి గలుగు నని జగ
ద్బాంధవు నిను బుత్తెంచిన
గాంధారేయులకు జన్నె కదనాకాంక్షల్ ?

"తగవులు సహోదరులలో
తగ"వని, సగ మొసగి మనుట తగవని, మేమిం
తగ వారి గోరినందుకు
తెగించిరటె ! బిఱ్ఱబిగిసి ధృతరాష్ట్రసుతుల్ !!

హింసామయ జీవనుల బ్ర
శంసింతురటయ్య ధర్మశాస్త్రజ్ఞు ? లస్మృ
జ్మాంసాహుతు లందక యీ
సంసార మహామఘుంబు సాగదటయ్యా !

సింహాసనమ్ముకొరకై
సంహార మొనర్ప్రజాల సంబంధుల ; మా
యంహశ్చరితల "భారత
సంహిత"ను కళంకితమ్ము సలుపగజాలన్ !

దారుణ రణాంగణమ్మున
మారణ మొనరించి కురుకుమారుల, తద్ర
క్తారుణ ధరణిరాజ్య
శ్రీరమణుఁడ నగుట సిగ్గుచేటు మురారీ!

అర్థములకోసమై పర
మార్థమ్మును విస్మరించి యన్యోన్యమ్మున్
స్పర్థించి రణము సేసిన
వర్ధిల్లునటయ్య భరతవంశము కృష్ణా!

చుట్టాల చంపి పట్టము
గట్టుకొని సుఖించు కాంక్ష కంటె, విరక్తిన్
నట్టడవి కావిపుట్టము
గట్టుకొని తపమ్ము సేత కార్యము గాదే!

సంతోషించితి కురురా
ట్సంతానము సమ్మతించు సంధి కని, యికన్
శాంతియొ క్రాంతియొ ముందిడి
కౌంతేయుల గావుమయ్య! కమలదళాక్షా!

పాంచాలి

మారనిమాట లేటి కిటు మాటికి? కూటికి తోటిరాజుతో
బేరము లాడుటే మిగుల పేలవ! మంతట బోక సంధికిన్
వారు తిరస్కరించి కరవాలము లెత్తిన నిర్నిమిత్త ని
స్సారవిచారులై మెడలు సాచుట శోచ్యము నైచ్య మెంతయున్!

అయెనుబోయె సంధి; యికనైనను నాయకు లాయుధమ్ములన్
దీయక ధర్మశాస్త్రములు త్రిప్పుట నమ్మిన వారి గొంతుకల్
గోయుటగాదె - మీరు గయికొన్న యహింసలు హింసలయ్యె నా
త్మీయులయందు - చాలు గురితింపుడు పీడితజాతియాతనల్!

పుట్టితి పూజ్యుడౌ ద్రుపదభూపతికిన్; జగజెట్టి పాండు స
మ్రాట్టుకు కోడలైతి; నభిమానధనుల్ ఘనులైనవారి చే
పట్టితి; శౌర్యధైర్య గుణపాత్రుల పుత్రుల గంటి; నూడిగం
బెట్టుల జేయజాలుదు నిసీ! మగవారలు సిగ్గుమాలినన్!

అన్నయు నాన్నగారు చతురంగబలమ్ముల తోడ నస్మద
భ్యున్నతి గోరివచ్చిరి, మహోదయు లీక్రియ నీళ్ళు ద్రింగుచున్
మిన్నులు సూచిరేని విషమించు పరిస్థితు - లైనవారిలో
చిన్నతనమ్ము మోయుదురె! ఛీ యని నవ్వురు నవ్విపోవరే!

హింస యహింస యంచు నొకచో యొకచో తిరుమంత్ర మేదొ మీ
మాంసకుదెచ్చి, మా రుధిరమాంసములన్ బలియిచ్చి, ఇష్ట వి
ధ్వంస పథమ్మునన్ నడచు వైఖరి నేటికి చాలు - దుష్ట వి
ధ్వంసన మాచరింప విలు దాల్పుడు! నిల్పుడు క్షాత్రదీపికల్ !

చాలితిరేని ముందునకు సాగి - సపత్నుల నాగి - పత్ని పాం
చాలి కచాలి కూర్పుడు! విచారము దీర్పుడు! శౌర్యధైర్యముల్
చాలవయేని ధర్మములు చాలిక పెద్దలు మిన్నకుండుడీ;
బాలురు దీర్తు రీ సమరభారము "భారతభాగ్యమూర్తులై".

మండితపాండవాన్వయుడు మా యభిమన్యుడు, మండితద్విష
న్మండలు డా ఘటోత్కచకుమారుడు చాలరె ధార్తరాష్ట్రులన్
పిండియొనర్ప-హెచ్చు పయిపెచ్చులు నచ్చుకొనన్ ధనుష్కళా
పండితు డన్నలేడె! యుపపాండవు లేమి కృపాణహీనులే!

"భారతవీరమాత" యగు భాగ్యము ప్రాప్తిలు అత్తగారి కం
చూరక చూచిచూడనటు లుంటిమి; అమెకు దక్కకున్న ఆ
గౌరవలక్ష్మి లభ్య మగుగాక కుమారుల గన్న మా హిడిం
బా రమణీలలామకు - సుభద్రకు - ఈ ద్రుపదాత్మజాతకున్!

భీముడు

ఏమీ యిప్పటికైన ముం దడుగు లేనేలేద! నేపథ్య మి
థ్యా మీమాంసల కంతు గల్గద! గదాదండంబు దుర్యోధన
ప్రేమాలింగన మెప్పుడెప్పు డని సంప్రీతిన్ కురుక్షేత్రసం
గ్రామక్షోణికి పర్వులెత్తెడి భుజాస్కంధమ్ము లంఘించుచున్!

శ్రీకృష్ణుడు

ఆశాస్యమ్ములు దీరు చెల్లి! సహదేవా మెచ్చితిన్; భీమసే
నా శాంతింపుము; సత్యమోయి నకులా! అట్లే కిరీటీ! రణా
వేశుల్ సోదరు లాగబో రిక దయాబ్ధీ ధర్మరాజేంద్ర! మా
కాశీర్వాదము లిమ్ము, లెమ్ము, కొనుమయ్యా! కేల కోదండమున్!

నిండిన పాపభాండ మవనిం బడి బ్రద్దలు గాకపో; దికన్
పండిన దుష్క్రియాఫలము భళ్ళున ద్రెళ్ళక పోదు; ప్రజ్వలత్
పాండవరోషవిస్ఫుర దభంగనిషంగసితాంబకాగ్నులన్
మండకపోవు భగ్గు మని పూర్తర వంశ మహాటవీస్థలుల్!

గ్రామము లైదు మీ రడుగగా కురురాజు నిరాకరించి సం
గ్రామ మొసంగినా డొకటి; కాదనరా దిక లెందు ధార్మిక
గ్రామణులార! తోరణము గట్టి యథేచ్ఛగ నేలుకొండు ప్ర
జ్ఞామతులై, భవద్గుణగణంబులు దిక్కుల మారుమ్రోయగన్!

భీ ము డు

త్రిపథగాసుత, కుంభజ, మద్రరాట్,
కృప, జయద్రథ, కర్ణుల కోడి, మా
శపథముల్ విఫలమ్ముల బుత్తుమే?
కుపథవర్తనులన్ మననిత్తుమే?

అ ర్జు ను డు

పర పరాభవ రోష పరీతుడౌ
నరుడు కింకరుడై నిదురించునే?
శరశరాసనముల్ గొని డుల్పడే
ధర, విరోధి శిరోధి సమూహముల్!

న కు లు డు

కుపిత పాండవ కాండ హత ద్విష
న్నృపతి రక్తనదుల్ తిలకింపకే
ఉపశమించునె పీడత తాడిత
ద్రుపదరాజ తనూజ మనోరుజల్?

స హ దే వు డు

"ధణ ధణం ధణ" భీమ గదా ధ్వనుల్
"ఘణ ఘణం ఘణ" పార్థ గుణ ధ్వనుల్
వ్రణములై శ్రవణమ్ముల దాక, మా
రణము గాంతురు గాక కురుప్రభుల్!

ధర్మరాజు

నలుగురు సోదరు లొకరై
యలుగులు సింగాణు లూని యలిగిన, నిలువం
గలుగుదు రెవ్వారలు? మరి
కులక్షయమ్మునకు మనసు కుందు ముకుందా!

మా పాలు మా కొసంగగ
భూపాలున కింత బుద్ధి పుట్టకపోయెన్!
కోపాలసు లగు తమ్ముల
చాపాలకు పనులు వెట్టె స్వార్థపరుండై!

నెయ్యమునకు మే మంపిన
కయ్యమునకు దింపినారు కౌరవులు; వృథా
యయ్యో మదాశయ; మిక నా
దయ్య యెరుగు కురుకులంబు దశ యేమగునో!

ఏమయిన తప్పు దిక సం
గ్రామ, మ్మాపైన నీవె గల వన్నిటికిన్!
మా 'మాతృశ్రీ' బిడ్డల
కే మని సందేశ మంపె నీ విషయమునన్?

## శ్రీ కృ ష్ణు డు

విశ్వవిఖ్యాత భారతవీరమాత
కుంతి పడియుండె కురురాజు కొంపలోన;
అశ్రుధారలు తన లోచనాంచలముల
యమునలై గంగలై కృష్ణలై స్రవింప!

బిడ్డలకు దూరమై యొక గ్రుడ్డిరాజు
రాజ్యమున జిక్కియుండె మీ పూజ్యజనని!
వత్సమును బాసి రాకాసి వనములోన
క్రూరమృగ మధ్యమున గంగగోవు వోలె!

నన్ను గని కౌగిలించి, యానంద కరుణ
గద్గద గళమ్ముతోడ స్వాగత మొసంగి,
కన్నబిడ్డల, కోడండ్ర, చిన్న మనుమ
లందరను సేమమడిగిన దత్తగారు.

పరుల పంచల పడు భంగపాటు లెల్ల
చెప్పి వాపోయె గుండెలు చెరువుగాగ;
బాష్పముల నాగి, జయవాక్కు పలికి; మీకు
తెలుపుమన్నది మాతృ సందేశ మిట్లు—

(మాతృసందేశము)

"స్వచ్ఛజ్యోత్స్నలు చిందు చందురుని వంశమ్మందు జన్మించి, యే
కచ్ఛత్రేశుని బిడ్డలై, భరతరక్తమ్మున నెమ్మేనులన్,
స్వచ్ఛంద ప్రియ భావి జీవన సుధాస్వాదంబు గావింతురో!
స్వేచ్ఛాలక్ష్మికి స్వస్తి చెప్పి పరులన్ సేవించి జీవింతురో!

విపరీతమ్ముగ విశ్వ విప్లవ మహావిఖ్యాతికై మాయదా
రి పిశాచమ్ములు రెక్కలార్చుచును గర్జించెన్ సముద్రాలపై;
ఎపుడోలే యనుకొన్న యుద్ధ మది రానేవచ్చె, మీ దొడ్డి గు
మ్మపుమెట్లెక్కిరి శాంతిఘాతుకులు సామ్రాజ్యక్షుధాబాధితుల్!

భారతభాగ్యదీపికలపై మసిబొచ్చెలు మూయువార లె
వ్వారలురా? యపార మనవద్య మపూర్వ మఖండ మైన మీ
వీర విజృంభణమ్మునకు విశ్వము విస్మయ మందురా! భవత్
పౌరుషలక్ష్మి కారతులు బట్టునురా సకల ప్రపంచముల్!

సంపాదించిన తండ్రి వైదొలగ, తత్సంతానమౌ మిమ్ము గ
ర్హింపన్ సాగెను పెద్దతండ్రి; కపటప్రేమం బ్రదర్శించి ని
ర్మింపన్ సాగెను స్నేహసౌధ; మటుపై మీసొంపు మీపెంపు మీ
కంపే గిట్టకపోయె కౌరవులకుం గాలప్రభావమ్మునన్!!

దేశకళ్యాణ దివ్యసందేశదీక్ష
నందుకొని, స్వేచ్ఛకొరకు పిల్లందుకొనుడు!
భరతసంతతి భావిసౌభాగ్యమునకు
సాగుగావుత స్వాతంత్ర్యసమరరథము!

వీరభారతభూమి నావిర్భవించి
పౌరుషము లేని బానిస బ్రతుకులేల?
ఈ యయోమయ శృంఖలా లింకనైన
త్రెంపుకొని బైటపడి విజృంభింప రేల?

తన కుమారుల పరతంత్ర దశ తలంచి
తల్లి హృదయము పడు - బాధ - తపన - యెరుగ
రెట్టిదో యెవ్వరును; ఆశ పెట్టుకొంటి
సుతుల అతుల భుజా బలోద్ధతుల మీద!

దిక్కు చెడియున్న మీతల్లి దిక్కు జూచి
గుండెలోని సెగల్ రగుల్కొల్పుడయ్య!
దాస్య దారిద్ర్య గాఢాంధతమసమందు
జ్యోతి వెల్గింపవలె యుగాభ్యుదయమునకు!!

ఏ మహోద్దేశ సిద్ధి లో నిచ్చగించి
ప్రియకుమారుల గనును క్షత్రియసవిత్రి;
ఆ మహోద్దేశ సంసిద్ధి నాత్మ నెంచి
నడుములు బిగించి ముందుకు నడువుడయ్య!

క్షాత్ర తేజస్సు భారతక్షేత్ర మెల్ల
చల్లబోయెడి శ్రమికకర్షకులు మీరు;
కృష్ణమేఘము మిము కటాక్షించె నింక
మీకు సులభము విజయలక్ష్మీ ఫలమ్ము".

అనుచు దెలుపు మనియె అత్త మీతో—పార
మప్పగించినాను చెప్పినటుల;
ఇంక సిద్ధపరచుడీ కురుక్షేత్ర సం
గ్రామమునకు గదలు గాండివములు.

ఆలకించినారలా బావలార! మీ
యేపు జూపవలయు రేపు మొదలు;
దూతకృత్య మెట్టులో తీరిపోయె—నే
సూతకృత్యమునకు జొత్తు నింక!

* * * * *
* * * * *

అని చిరునవ్వు నవ్వుచు మురారి కిరీటిని దట్టి కూరుచుం
డెను; కుతుకమ్ముమై వడముడిం గనుగొన్నది కృష్ణ; ధర్మ నం
దనుడు ప్రసన్నతం గనె; గదం గదలించెను భీమసేను; డ
ర్జునుడును గాండివమ్ము దెసజూచె; కవల్ పులకించినారలున్ !!

అం దేకాంత రహ స్సభాంతరమునం దాయోధనప్రక్రియా
సందర్భమ్ములు సంప్రదించుకొను పాంచాలీయుతుల్ పాండవుల్
"వందే మాతర" మంచు భక్తిమెయి సంభావించి రాత్మ ప్రసూ
సందేశమ్ము, వినమ్ర శీర్షములతో, సంతోష బాష్పాలతో !!

# స్కంధావారము

## శ్రీకృష్ణుడు

మణిమయ స్వర్ణ కింకిణీ మంజులములు
అరిభయంకర కపికేతనాంకితములు
రంగ దుత్తుంగ ధవళ తురంగమములు
జయముగను పార్థ! నీ రథస్పందనములు !!!

పరిచితాఖిల సంగర ప్రాంగణములు
త్రాస పరిభూత కర్ణ దుశ్శాసనములు !!!
సంభృతానేక నవయుగ స్వాగతములు
అలరు విజయ! త్వదీయ శంఖారవములు !!!

సత్వర పరాజి తారాతి సంచయములు
దివ్య మహిమ విశేష సందీపితములు
శమిత శతకోటి శతకోటి సంభ్రమములు
వెలయు గాండీవి ! నీ ధనుర్విభ్రమములు !!!

ముందు కూర్చుండి నే పగ్గములను బట్టి
రథము నడపింతు సంగ్రామ పథమువెంట,
చేత విలు దాల్చి లక్ష్యమ్ము చెదరకుండ
కార్యసిద్ధికి నీ వింక గడగుమయ్య !!

అర్జునుడు

రణ ముహూర్తము డాసె యుద్ధా
రంభ ఘంటలు మ్రోగనున్నవి
క్షణము మన మిట సైన్య సమవే
క్షణము సేయుదమే !

దుష్ట దుర్యోధనుని కొరకై
కష్టపడి కయ్యమ్ము సేయగ
వసుమతీపతు లెవ్వ రెవ్వరు
వచ్చియున్నారో !

రాజరాజు సహాయులై ఘో
రాజి సలుపగ నరుగుదెంచిరి
రాజసూయము మరచిరో మన
రాజనందనులు.

మాధవా! రథ ముభయ సేనా
మధ్యమున నడపింపుమయ్యా!
యోధులను పరికింత మింత సు
యోధనానుగులన్.

శ్రీకృష్ణుడు

అతిరథులు వీరు; అల్లవా రర్ధరథులు;
అరుగొ సమరథు లచట; మహారథు లిట;
యుద్ధ సన్నద్ధులై నిల్చియున్నవారు
రాజసుతులు నిజధ్వజ రాజి వెలయ.

భట హుంకృతు లొక యెడ, గజ
ఘట ఘీంకృతు లొక్కయెడ, నఖండిత భేరీ
పటు భాంకృతు లింకొకయెడ,
అట నట జ్యాటంకృతులు, ధ్వజాహంకృతులున్.

కేల పెనువిల్లు వెలయ, నుత్తాల తాల
కేతనమ్ము ధరించి మీ తాతగారు
కౌరవాధీశు సేనాముఖమ్ము నందు
అలరుచున్నాడు చూచినావా కిరీటి!

"కదలివచ్చిన హిమవన్నగంబొ!" లేక—
"గడ్డకట్టిన పుంస్త్వమో!" కాక— "రూపు
నందుకొన్నట్టి వీర రసావతార
మో" యన వెలుంగు వృద్ధగాంగేయమూర్తి!

ప్రాత రుత్ఫుల్ల పంకజశ్రీ తలిర్చు
ఆ కనుల కెంత బ్రహ్మచర్య ప్రదీప్తి!
కదలుచున్న ఆ తెల్లని గడ్డ మెంత
పండిపోయెనొ క్షాత్ర తపస్సునందు!

ఈ మహామహుడైన పితామహునకు
ప్రేమ యధికంబు మీ మీద—నేమి సేయు
తప్పదయ్యె - వేల్పులు మింట గుప్పవడిరి
తాత మనుమల ద్వంద్వయుద్ధమ్ము సూడ!

భీష్ము పార్శ్వాన ధీరగంభీరమూర్తి
కురుకులాచార్యు డున్నాడు కుంభజుండు!
కంటె కాంచనమయవేదికాపతాక!
సమర జయలక్ష్మి కదియ విశ్రాంతిపీఠి!!

అస్త్రవిద్యా రహస్యము లన్ని తెలిపె
కుంభభవునకు నీ వన్న కూర్మి పెద్ద;
శైశవాభ్యస్త మగు ధనుశ్శాస్త్రమందు
శిష్యుని గురూత్తముడు పరీక్షించు నేడు.

గురున కా ప్రక్క అపర శంకరుని భంగి
శౌర్యసంపన్ను డగు కృపాచార్యు డడుగొ!
కురుమహీపతి యన్నమ్ము గుడుచు కతన
వచ్చియున్నాడు రారాజు వైపు నేడు.

సింహలాంగూలకేతనశ్రీ వహించి
యల్లవాడె యశ్వత్థామ! యనుగు మామ
నానుకొని నిల్చియుండె; నాజానుబాహు
డన్నిటను కన్నతండ్రి కీడైనవాడు.

అతడె! శకునాల పక్షి, పండితుడు మాయ
పాచికల—మ్రుచ్చు కనుబొమల్ సూచినావె!
దొంగజూదమ్ములో సిరుల్ దోచుకొన్న
మీ సుయోధను గారాబు మేనమామ!

అల్లదే! ముద్దు బావ జయద్రథుండు
సింధుదేశాధిపతి దయచేసినాడు;
సోదరీమణి పాంచాలి జోలి కేగి
తియ్య తియ్యగ తన్నులు దిన్నవాడు!!

భద్రగజము వీపుపైన—అక్షౌహిణుల్
పదునొకండు తన్ను బలిసి కొలువ;
వెల్ల గొడుగు క్రింద వేంచేసియున్నాడు
పెద్ద తండ్రిగారి పెద్దకొడుకు!

ఇండ్లు గాల్చుటందు, ఇల్లాండ్ర వస్త్రమ్ము
లొల్చుటందు, మేటి యుక్కలుండు!
కుటిలబుద్ధి—వీని గుణము నూహింపంగ
పడగమీది నాగుబాము చాలు.

రాజు ప్రక్క నంగరాజు నీక్షించితే
శక్తిశాలి సూర్యసన్నిభుండు;
పౌరుషమ్ము మొలచె కోరమీసాలలో
విప్ర శాప లుప్త వీర్యు డితడు!

అరుగొ! దుశ్శాసనాది సోదర శతంబు
అన్న కిరువైపులం గాచియున్నవారు;
లక్ష్మణాదులు వచ్చి రాలమ్ము కొరకు
కురు కుల కిశోరములు కనుంగొను కిరీటి!

మనకు సాయమ్ము సలుప రా; మార్గమందె
మాయచేసి స్వపక్షమ్ము మలపె రాజు;
మద్రదేశాధినేత మీ మామగారు
శల్యు డల్లడుగో వచ్చె సమరమునకు.

అతడు భగదత్తు! డితడు బృహద్బలుండు!
వాడె కృతవర్మ! భూరిశ్రవస్సు వీడె!
బాహ్లిక సుదక్షిణాదు లాప్రక్క! సోమ
దత్తు డీ ప్రక్క నిలిచి రాయత్తులౌచు!!

అప్తులు కౌరవేశ్వరున కత్యధికంబుగ; శౌర్యధైర్య సం
దీప్తులు; నిగ్గుదేరి చలిదీరిన వా; రొకపాటి పోరికిన్
తృప్తి వహింపబోరు; సమితింజయు లందరు; రాజువెంట సం
శప్తకు లున్నవా రదె సుశర్మముఖుల్ పదివేవు రర్జునా!

అరదము లొప్పు దీవుల క్రియన్, ధరణీధర సన్నిభమ్ములై
ద్విరదము లొప్పు, నంబువు గతిన్ రజమొప్పు, భటాళి వొల్చు వా
శ్చరములటుల్, తురంగము లెసంగు తరంగములో యనన్, మహా
శరనిధి భంగి నున్న కురుసైన్యము గంటె ప్లవంగకేతనా!

# వి షా ద ము

అ ర్జు ను డు

ఆగుమాగు మొకింత బావా;
అస్మదీయ హృదంతరమ్మున
ఆగికోలేకుంటి భావా
వేగ మిది యేమో!

మారుచున్నది యంతకంతకు
మాధవా! నా యంతరంగము
క్రొత్త భావన లేవియో తల
లెత్తుచున్నయవి.

దేహమా కంపించుచున్నది
"ద్రోహమా" యనిపించుచున్నది
మోహ మేదో కుంచుచున్నది
స్నేహ బంధములన్.

గాండివము చే వీడుచున్నది
గుండె గజగజలాడుచున్నది
ఎండుచున్నది గళము, నే ని
ల్చుండలె నంకన.

బందుగుల ద్రుంచింప భావం
బందు సందియ ముద్భవించెను;
అందరను హతమార్చి నే నే
మందుకోగలనో ?

వలదు విజయశ్రీ వికాసము
వలదు రాజ్య రమా విలాసము
వైభవోజ్జ్వల సౌధ వాసము
వలదు వలదయ్యా!

శ్రీ కృష్ణ

ఇదియేమీ ! ఇదియేమి ! యేమిది కిరీటి ! ఈ వృథావిస్మయా
స్పద నిర్విణ్ణత కర్థమేమి? గ్రహదోషమ్మో ! పరీహాసమో!
మదిరాపానమొనర్చితో ! నిదురలో మాటాడుచున్నావొ! నీ
హృదయమ్మున్ పదిలమ్ము సేసికొనుమోయీ సుంత, వీరాగ్రణీ !

గాండీవ మ్మది చేయిజారినది, మై కంపించెడిన్, బాష్పముల్
నిండెన్ కన్నులయందు - ఏమిటిది కౌంతేయా! ద్విషత్సైన్యముల్
"బండార మ్మది బైటపడ్డ" దని వేళాకోళముల్ సేయరే!
రెండే రాజుకు "స్వర్గమో జయమొ" వేరే మార్గమే లేదికన్ !

అంగేశుం గని భీతి నందితివొ! ద్రోణాచార్యు వీక్షించియే
కంగారెత్తెనొ ? ధార్తరాష్ట్రశతమే కంపమ్ము కల్గించెనో!
గంగానందను గన్న కాతరతయో ? కాకున్న సంగ్రామమే
సింగారమ్మగు రాచపుట్టువున కిస్సీ ! యింత వైక్లబ్యమా ?

ఇందరు శౌర్యధైర్యధనులే ! సమరాంగణసార్వభౌములే!
సందియ మింతలే, దయిన సార్థక మేమి? అధర్మపక్షులై
ముందుకువచ్చివ్రాలిరి సమూహముగా ; మన వింటిదెబ్బకున్
చిందరవందరై పడి నశింపక తప్పదయా ! ధనంజయా !

ఎంతపని కొడిగట్టుచుంటిని!
ఎంతఘోరము సేయనుంటిని!
భ్రాంతమై స్వాంతమ్ము చింతా
క్రాంత మగుచుండెన్.

సిద్ధవందితచరితు ; కురు కుల
వృద్ధు ; గాంగేయుని ; పితామహు
యుద్ధమున దయమాలి విశిఖా
విద్ధు చేయుదునే!

ఆర్యజనసన్నుతుని ద్రోణా
చార్యు మద్గురుదేవు --- కార్యా
కార్యమూఢుడనై యెదుర్చుట
గౌరవమ్మగునే?

రాజ్యలోభాక్రాంతమతితో
సజ్య మగు గాండివము గైకొని
పూజ్యపాదుల మీదనా నా
పురుషకారమ్ము?

దుష్ట దుర్యోధనుడు లోభా
కృష్ట నిష్ఠుర మానసుండై
ఇష్టజన విధ్వంసనమ్మున
కిష్టపడినాడు.

ధూర్తమతినై స్వార్థమున కల
ధార్తరాష్ట్రుల కసిమసంగిన
కీర్తి గందునొ! రాజ్య కాంక్షయు
పూర్తిచెందునొకో!

ఇట్టి దారుణ మారణ క్రియ
కెట్టు లోర్చు మదీయహృదయము?
కొట్టనీ! కౌరవులు, చేతులు
కట్టుకొని యుందున్.

త్రిజగతీరాజ్యమ్మె రానీ
విజయ నామమె మాసిపోనీ
స్వజనమును హింసింపజాలను
నిజ సుఖమ్మునకై.

గోడుగోడున నాలుబిడ్డల
నేడిపించి, సమస్త రాజుల
వాడి శరముల ద్రుంచి, నెత్తురు
కూడు దినజాలన్.

కక్షమెయి పోరాడుకొని యిరు
పక్షముల నెందరు నశింతురో ?
రక్ష కలదే జాతి కింక, కు
లక్షయము కాదే ?

"ధర్మ సమ్మూఢమ్ము" చేతము,
ఘర్మ కణ సంప్లుతము గాత్రము,
మర్మములు వెగగోయు శోకము
మాటి మాటికిని.

పుణ్య పదవీ భ్రష్టుడను "కా
ర్పణ్య దోష హత స్వభావుడ"
గణ్య మగు కర్తవ్య మార్త శ
రణ్య ! తెల్పగదె !

## శ్రీకృష్ణుడు

చిక్కని పోటుమానిసి వినీ! పసిదప్పి త్రపాకరమ్ములౌ
వాక్కులు పల్కఁజొచ్చితి వవారిగ, వైరిగణమ్ముమధ్య; నే
డెక్కడనుంచి యూడిపడె నింత వివేకము నీకు; నవ్వరే
"పక్కున" నీ యకాల సముపస్థిత శేముషి గాంచి భూపతుల్!

చిత్తముచిక్కఁబట్టుము; త్యజింపుము బేలతనమ్ము; మోము పై
కెత్తుము; ధైర్యమున్ జెదరనీకుము; కొంపలు మున్గునయ్యా! నీ
తత్తరపాటు, నీ ముఖవిధంబు పరుల్ పసివట్టిరేని—పో
నిత్తు రథమ్ము నా తరువునీడ కటన్ వినిపింతు నంతయున్.

# ప్రబోధము

### శ్రీకృష్ణుడు

అల వారాణసి కౌరవోజ్జ్వలిత లాక్షాగార రూక్షారుణ
జ్వలన జ్వాలిక లీ నిమేషమునకున్ జల్లారలేదే! మహో
జ్జ్వల గాండీవము సజ్యమై శరములన్ వర్షింపనేలేదె! ఈ
చలి నీ కెక్కడ దాపురించినది? సంస్తంభించె సర్వాంగముల్!

అంధత్వమ్మున కన్నుగాన కలనా, డా గ్రుడ్డిదర్బారులో
గాంధారేయులు కాలదన్నిరి జగత్కల్యాణసంబంధియౌ
సంధిన్—సల్పిన సంప్రదింపు లెదురై సంధించె—గాండీవమే
సంధింపన్ బని గల్గె, లే వితరథా సంబంధబాంధవ్యముల్!

తప్పదు హింస; ఎందుకు వృథావ్యథ నీకు? రథమ్ము వెన్కకున్
ద్రిప్పితినేని సాయమరుదెంచిన యిందరు ధారుణీపతుల్
దెప్పరటయ్య! మీసములుద్రిప్పితి రా సభలోన; నా డటుల్
గొప్పలు పల్కి నే డిటు దిగుల్పడి దిగ్భ్రమ నంద జెల్లునే?

అర్జునుడు

గుండెలు రాయిచేసికొని, క్రూరుడనై, కురురాజు సేనపై
గాండివ మెక్కువెట్టి, రిపుకంఠవిలుంఠన మాచరించి, యీ
ఖండనభూమి, తద్రుధిర పారణ మత్త పిశాచ డాకినీ
మండల తాండవమ్ము గన మామకమానస మొప్ప దచ్యుతా!

ఇంక రణోత్సుకత్వము వహింపగజాలను—బాహువుల్ త్రపా
సంకుచితమ్ము-లాత్మజన సంహరణక్రియ కంతరంగ మా
శంకిత-మా మహేశ్వరుని సాక్షిగ, చాలక గాదు, పోరికిన్
జంకియు గాదు, క్రుంకు లిడజాలను రక్తనదీనదమ్ములన్!!

పెద్దన్నయ్య యహింసయే మదికి సంప్రీతిన్ సమర్థించె, నా
యుద్దేశమ్ములు మారె, గ్రమ్ముకొనె నేవో మోహమేఘమ్ము, లీ
గద్దెల్ మిద్దె లశాశ్వతమ్ములు మిథః; కార్పణ్యముల్ చాలికన్
వద్దయ్యా! పరపక్ష మారణ రణ వ్యాపార పారీణతల్!

కత్తుల గ్రుచ్చినన్, శరముఖమ్ముల గ్రచ్చిన, కార్ముకమ్ములన్
మొత్తిన, నెత్తిపై గదల మోదిన, నెత్తురు పీల్వసాగినన్,
కుత్తుక నొక్కి పైన బడి కొట్టిన, తిట్టిన, శాంతితోడ నో
రెత్తక మిన్నకుందు నెవ రేది యొనర్చిన చూచుచుండెదన్ :

శ్రీకృష్ణుడు

కొంచెపు మాటలాడెదు—జుగుప్స! అశోచ్యుల కొస మేల శో
కించు? "టనార్యజుష్ట" మపకీర్తికర, మ్మపవిత్రమైన దీ
చంచలబుద్ధి, కశ్మలత చాలు, మహా ప్రళయమ్ముగా నివే
ముంచుకవచ్చుచుండె నలుమూలలనుండి విరోధివాహినుల్ !!

పెంటితనమ్ముమై మనసు పేదరికమ్మున కోడి, మేటి రా
బంటుతనమ్ము పోవిడిచి పల్చనిపల్కులు పల్కు టెట్లు? ము
క్కంటిని నిల్వరించిన మగంటిమి యెక్కడవోయె? నేడిటుల్
గంటిని కన్ను లెన్నడును గాంచని చేష్టలు చిద్విలాసముల్ !!

రక్తపుకూడుగాక మన రాజులకున్ ఘృతసూపయుక్తమౌ
భుక్తి లభించునే? విడిచిపుత్తువె ధర్మవు? కర్మసూత్ర సం
సక్తము సృష్టి యెల్ల, సహజమ్ములు తప్పవు చావు పుట్టుకల్,
ప్రాక్తనపుణ్యపాపములు ప్రాణులకున్ సుఖదుఃఖహేతువుల్ !

చంపుటొ చచ్చిపోవుటయొ క్షాత్రము, విస్తృతవిద్విషచ్ఛ్రమూ
సంపద గాంచి గుండె దిగజారి, అకారణవిస్మయస్మయో
త్కంపము చెల్లునయ్య! కులధర్మము వీడుట పాడియయ్య! మీ
కొంపలు గాల్చు దుండగపు గుంపులపై సనుకంప యేటికిన్?

ముక్కిడి కౌరవాధములు మోసము సేసి దురోదరమ్ములో
ద్రొక్కిరి యుక్కుపాదములతో మిము; ద్వేష రుషా విషార్చులన్
గ్రక్కిరి; లక్కయిండ్ల నిడి కాల్చిరి; బంధుగు, లన్నదమ్ములం
చక్కటికమ్ము గైకొనెద వక్కట! యుక్కటిలాత్ము లందునన్!

హింస యొనర్ప నంటివి సరే! మిము హింసల పాలొనర్చు వి
ధ్వంసక శక్తులందు దయదాల్చుట ధార్మికహింసకాదె? మా
కంసుని జంపి లోకముల కష్టము దీర్చనె! చెల్లునే యసృ
జ్మాంసము లెంత తిండికయి మాడుట రాచకొలమ్మువారికిన్!

లెమ్ము ధనంజయా! విధి బలీయము! న్యాయముగెల్చు; నిల్చు స
త్యమ్ము; నశించు స్వార్థము; సదా యుగధర్మ మిదేగదోయి! క
న్గొమ్మిక నంత్యకాలమున నూర్గురు బిడ్డలతండ్రికైన పిం
డమ్మిడు దిక్కు గల్గ దకటా! గ్రహచారము తప్పివచ్చినన్!

"అర్థింపన్ విజయమ్ము, భోగముల నభ్యర్థింప, రాజ్యార్థినై
ప్రార్థింపన్ సిరు" లంచు ధర్మముల ప్రారంభించినా వేమిటో
పార్థా! చాలును కట్టిపెట్టుము వచఃప్రాగల్భ్యముల్; చాలురా
స్వార్థత్యాగము, తల్లిపిల్పు వినరా! శంఖమ్ము పూరింపరా!

శంకాసంకుచితాంతరంగులు, వృథాసందేహమందేహులున్,
కింకర్తవ్యవిమూఢచిత్తులు కురుక్షేత్రమ్ములో నిల్వరా;
దింకన్ మార్గము లేదు; వింట విశిఖమ్మే లాగెదో, కానిచో
"పంకా లాగెదొ" రాజరాజునకు బావా! రెండు హస్తాలతో!

ధర్మక్షేత్రము, క్షాత్రమండల పవిత్రమ్మౌ 'కురుక్షేత్ర' మన్
కర్మక్షోణి స్వధర్మనిర్వహణదీక్షం దాల్చి, విద్రోహులన్
నిర్మూలించి "స్వతంత్ర భారతభవానీ వీరసంతానమై"
మార్మ్రోగింపుము దిగ్దిగంతముల యుష్మద్దేవదత్తధ్వనుల్!

అంగత్రాణకృపాణబాణధరులై, యంగమ్ము లుప్పొంగ, దు
స్సంగ స్వార్థ మదేభ కుంభములపై సంగ్రామరంగమ్మునన్
సింగమ్మట్టుల దూకి, కర్కశ ఖరాసిన్ చించి చెండాడ కీ
భంగిన్ వీరులు భీరులై చనుట దౌర్భాగ్యమ్మురా! జాతికిన్!!

నిద్రాణమ్మగు జాతికిన్ నవనవోన్మేషమ్ము చేకూర్చి, ని
ర్ణిద్ర స్ఫూర్తి స్వతంత్రభారత పునర్నిర్మాణమున్ జేయుటే
భద్రా! భద్రము క్షాత్రనందనుల, కీ భంగిన్ నిరుత్సాహివై
యుద్రేకమ్ము దొరంగి చల్లబడి నిట్టూర్పంగ నీ కొప్పునే!

జెండా జాతికి జీవగఱ్ఱ! సమతా చిహ్నమ్ము! సర్వస్వ! మీ
జెండా వంపు సహింపజాలని శిరశ్ఛేదమ్ము, లే లెమ్మికన్
జెండాడన్వలె శాంతిఘాతుకుల! జేజే లెల్ల జేజేలతో
గొండాడన్ వలె విశ్వవిశ్రుత భవత్ కోదండ పాండిత్యమున్!!

నీ దైన్య మ్మిక చాలు! గుండెగలదేనిన్ గొమ్ము కోదండమున్!
లేదా పోదము రమ్ము ద్వారకకు, వేరే వారు వీ రేల నే
నైదూ శ్మిత్తును బావ లైదుగుర, కత్యంతప్రశాంతమ్ముగా
వేదాంతార్థము ముచ్చటించుకొను డన్వేషింపుడీ బ్రహ్మమున్!!

"వీడే భారతవీరు డర్జునుడు! దోర్వీర్యస్ఫురాసంగర
క్రీడానిర్జితశూలి, నిర్జర గణ క్షేమంకరుం, డల్లదే
వా" డంచున్ వినువీధి గుంపులయి గీర్వాణుల్ విమానాలపై
జూడన్ వచ్చిరి, గుట్టు రట్టయిన నిల్చుండన్ గతుల్ గల్గునే?

"ఫెళఫెళ" మ్రోగెరా విజయభేరి ; ఢఙంఢఙ నిస్వనమ్మదే
పిలుచుచునుంటెరా ! పడుచుబిడ్డల వీరవిహారయాత్రకై;
ప్రళయ మహాశ్మశాన నటరాజ జటానట ద్భ్రవాహినిన్
తళతళలాడురా ! విజయుతాండవ పాండవచంద్రహాసముల్ !!

ఔదాసీన్యము నుజ్జగింపుము వయస్యా ! కర్మవీరుండవై
పాదమ్మూంచుము యుద్ధరంగమున, ని స్వాతంత్ర్యశంఖధ్వనుల్
వేదవ్యాస "జయ" ప్రబంధ కవితావేశమ్ములో మ్రోగు; ని
న్నాదర్శమ్ముగ జెప్పుకొందురు భవిష్యద్భారతీయ ప్రజల్ !

భవదీయస్తవనీయబాహుబల మోర్వంజాలు వాడేడి ? ప
ర్యవసాన మ్మది నేనెరుంగుదు, విదగ్ధాఖండ లాఖండ ఖాం
డవుడౌ పాండవమధ్యముండు కడకంటన్ గెంపురేకెత్త గాం
డివమున్ గైకొని నిల్చినన్ పగఱగుండెల్ క్రుంగికూలారవే.

అన్న కర "మ్మనంతవిజయమ్ము"న కాస్పదమైన, దింక నీ
కున్నది "దేవదత్తము" పు హొజ్జ్వలసత్త్వము, సవ్యసాచి కీ
విన్నదనమ్ము మున్నెపుడు విన్నది కన్నది కాదు, దుర్జయ
మ్మన్నది లేదు విశ్వవిజయా ! విజయా ! నరు డుద్యమించినన్ !

ఆత డజాతశత్రుడు ; మహాత్ముడు ; శాంతతపస్వి ; విశ్వవి
ఖ్యాతుడు ; ధర్మరా; జతని యాత్మిక శక్తికి లే వసాధ్యముల్ !
తాతలవంటివా రయిన తప్పుడు లోబడిపోదురోయి ! ధ
ర్మేతర శక్తు లెట్లు తల యెత్తును ధర్మబలము సన్నిధిన్ ?

సస్యశ్యామల, రత్నగర్భ; మహిమాసంపన్న మీ తల్లి దీ
నాస్యచ్ఛాయ లురమ్ము గ్రమ్ముకొన నిద్రాహార సన్యస్తయై
దాస్యంబీడ్చుచునుండె శాత్రవగృహద్వారమ్ములన్, చాలు నా
లస్యంబో కురుసింహ ! శృంఖలము లుల్లంఘించి లంఘింపుమా!

అమ్మ పరాయిపంచబడి, అశ్రువు లోడ్చుచునుండ బిడ్డ చి
త్తమ్మది చూచి యోర్వగలదా ! బ్రదుకుం బలివెట్టి తల్లి దా
స్యమ్మును దీర్ప కిట్లనదవై పడియుందువె చేతకాని ద
ద్దమ్మ విధాన ! ము న్నల బృహన్నలయన్నుడి సార్థకంబుగన్!

“విజయశ్రీ గొని తెత్తు వీ” వనుచు నువ్విళ్ళూరుచున్నారురా
విజయా ! సోదరులెల్ల ; నీ విటుల నిర్వీర్యుండ వైనన్, కపి
ధ్వజ మర్యాదయు, గాండివమ్ము పరువున్ ధ్వంసంబుగా నవ్వవే
త్రిజగంబుల్, తలయెత్తుకోగలదె కుంతీదేవి చుట్టాలలో ?

*

"శుభమౌ నీకు పథమ్ము" లెమ్ము ప్రభవిష్ణూ! జైత్రయాత్రా మహా
ప్రభ సాగింపుము దిక్కులందు, నికటప్రాప్తవ్యమౌ దివ్య భ
వ్య భవిష్యత్తుకు దారితీయుము, స్వతంత్రానందబాష్పాలతో
నభిషేకింపుమురా భవజ్జనని పాదాంభోజముల్ ఫల్గుణా!

నరు డేకైకధనుర్ధరుం డను, యఖండత్యాగదీక్షాధురం
ధరుడై నిల్చిన ముజ్జగమ్ముల నసాధ్యమ్మన్నదే లేదు, ద
గ్గరలే వెట్టి నిరోధశక్తులును, సంగ్రామావనిన్ నేడిటుల్
నరనారాయణు లొక్కటై నిలిచిరన్నన్ జెప్పనేమున్నదో!

రథియై గాండివ మూని ఫల్గుణుడు పోరాటమ్ము సాగింప, సా
రథియై పగ్గము లూని శౌరి రథసారథ్యమ్ము గావింపగా
ప్రధనమ్ముం దెదిరించి నిల్వగలడే ఫాలాక్షుడైనన్, వృథా
వ్యథ నీ కేలర వీరభారతకుమారా! విల్లు చేపట్టరా!

కృతహస్తుండవు, సాంయుగీనుడవు, సాక్షీభూతభూతేశ్వర
స్తుతిపాత్రం, బతిమాత్ర మైనది భవద్దోర్దండవిక్రాంతి; వి
స్మృతిపాల్గాకుము! వర్తమాన మరుదెంచెను! ధూర్తకౌరవ్యదు
ష్కృతికిన్ నిష్కృతి నేడు క్రీడిసమరక్రీడాసమారంభముల్!!

పాశుపతమ్ము నిచ్చుచు నపారకృపా పరిపూర్ణమానసుం
డా శశిశేఖరుండు "విజయా! విజయోऽస్తు! సమస్తవిద్విష
న్నాశన మాచరింపు" మని నా డనినాడుగదా! వృథావ్యథా
వేశపరుండవై తుడిచివేయుదు వెట్లు మహేశ్వరాజ్ఞలన్?

కట్టిడి వైరిరాచతలకాయలు గొట్టక, గాండివమ్ముతో
పిట్టలు గొట్టుకొందువొ! అభేద్యకిరీటము రాజు నొద్ద తా
కట్టిడి పొట్టనింపుకొనగా తలపెట్టితొ! రాజయోగివై
చెట్టుల పుట్టలం జపముసేయుచు నీ బ్రతు కీడ్వ నెంతువో!

నెగ్గితివో స్వరాజ్యరమ నీ శిరముం గయిసేయు జాళువా
నిగ్గులు చిందు రత్నరమణీయకిరీటముతో, రణావనిన్
స్రుగ్గితివో యశోరమ సురమ్య సుమంగళ పుష్పమాలతో
సిగ్గులు చిందిపోవ గయిసేయును నీ యురమున్ పరంతపా!

రాజ్యము వీరభోజ్యము; పరాక్రమశాలియె భారతీయ సా
మ్రాజ్యము నేలజాలు; రణరంగమునందున సత్యవీర్య సా
యుజ్యము గల్గె, కల్గ దిక ఓటమి; సల్పు మఖండయజ్ఞమున్,
పూజ్యము క్షాత్రమున్ విడువబోకుము, పోకుము పారుబోతువై!

పాంచాలీ పరిషత్పరాభవ మహాపాపౌఘమేఘమ్ము గ
ర్జించెన్ నీ ప్రతిపక్ష శీర్షములపై, శీఘ్రమ్ము లే లెమ్ము ! నీ
చంచద్గాండివ నిర్విముక్త విశిఖాసారమ్ముతోబాటు వ
ర్షించుంగావుత రక్తవర్షము ప్రహర్షీభూతభూతమ్ముగన్ !

"శ్రీమద్భారతభాగ్యరేఖ, "విజయశ్రీ" విశ్వవీరుండు, వీ
డా మా వా" డని హర్షవిస్ఫురితసర్వాంగీణగర్వోల్లసత్
ప్రేమావేశుడు పాండురాజు దివిషద్బృందాలతో శ్లిష్ట సం
గ్రామున్ నిన్ గనులార జూచుకొనుగాకన్ నాకలోకస్థుడై !

"చంచచ్చండగదాభిఘాతముల యుష్మద్దుష్టవక్షస్థలుల్
సంచూర్ణించి, కదుష్ణరక్తలహరీ సంసక్తహస్తుండనై
పాంచాలీ పరికీర్ణ కేశభరమున్ బంధింతురా!" యంచు గ
ర్జించెన్ భీముడు దుస్ససేను గని యా సింహంబు నిద్రాణమే !!

గంధేభమ్ములపై మృగేంద్రమువలెన్ గర్జింపుచున్, కౌరవ
స్కంధావారముమీద వాయుజుడు దూకంబోవుచుండెన్ భుజ
స్కంధమ్మందు గదాయుధమ్మిడి, ప్రతిజ్ఞాధర్మబంధాలలో
బంధింపంబడె నింతకాల, మిపు డాపంజాల రెవ్వారలున్ !

వాడిమి పెంపు రాచ మగవారికి సొంపులు నింపు, నగ్గికిన్
వేడిమివోలె; పౌరుషము వీడుట, జాలిగ మాటలాడుటల్,
పోడిమిగూర్చునయ్యా నిను బోటికి ? మంచి ధనంజయుండవే!
బూడిద మాడ్కి తన్నుకొని పోదురు దుర్బలులన్ బలాధికుల్!!

ఆగుటలేదు గుఱ్ఱములు, హస్తములన్ బిగబట్టి పగ్గముల్
లాగుదు నెంతదాక! రణలగ్నము డాయుచునుండె-దుందుభుల్
మ్రోగకముందె లెమ్ము! గుణముం బిగియించి స్వరాజ్యలక్ష్మికిన్
స్వాగతమిమ్ము గాండివశరాసన! చంద్రకులైకభూషణా!

జన్యము సేయ నస్త్రములు శస్త్రములుంగొని, దేశదేశ రా
జన్యులు వచ్చియుండిరి నిజధ్వజరాజివిరాజమానులై;
దైన్యము నంది నీ విటు స్వధర్మము దక్కిన, ధార్తరాష్ట్ర దౌ
ర్జన్య దవాగ్ని లా నిరపరాధుల నిల్వున గాల్చివేయవో!

పరధనముల్ హరించి, పరభామినులన్ జెరవట్టి, ధర్మ త
త్పరు లగు వారి బానిసలభంగి నొనర్చెడి దుండగీంద్రపై
కరుణ వహించి జాలిపడగాదగునయ్యా! నిరంకుశత్వ మ
ర్మర మనుజాధిపాధములు మానవజాతికి ఘోరశత్రువుల్!

నేనుంటిన్ రథమున్ గదల్చుటకు, సంధింతున్ సమస్తమ్ము నే
నే, నీ వుండు నిమిత్తమాత్రముగ; సందేహమ్ము పోనాడి నా
పైనర్పింపుము భారమంతయును; గెల్పింబో దధర్మంబు, మం
దేనోయీ విజయమ్ము; ముద్దులమరందీ! నమ్ము మువ్మాటికిన్!

కర్తన్ నేను సమస్త భూతములకున్, కౌంతేయ! సర్వమ్ములో
వర్తింతున్; అవతారధర్మమును నిర్వర్తింతు; భూభారమున్
దీర్తున్; నీవు నిమిత్తమాత్ర మగు మంతే! క్లైబ్యమింకేల నీ
కర్తవ్యమ్మును గుర్తెరింగి విజయా! గైకొమ్ము గాండీవమున్!!

శుద్ధాంతమ్మును రచ్చకీడ్చిన నికృష్టుల్ నష్టమైపోవుటే
సిద్ధాంతమ్ము; ధనంజయా! విజయలక్ష్మి శాంతి సంక్రాంతమై
యుద్ధాంతమ్మున వీరభారతము విశ్వోత్కృష్టమౌ—చాలు నీ
రాద్ధాంతమ్ములు—కార్యసిద్ధికయి లేరా! నారి సారింపరా!

గాండీవమ్ము ధరించి వైరిబలమున్ ఖండించి, యుష్మద్భుజా
పాండిత్యమ్మును జూప కీర్తియు భయభ్రాంతుండవై క్రుంగి కూ
ర్చుండన్, పాశుపతమ్ము మైలబడిపోదో! పాండుభూభృద్యశో
డిండీరమ్ముల పాండిమమ్మున కిరీటీ! లోటు వాటిల్లదో!

వనవాసమ్ములు తీరిపోయె ; చనె దుర్వారమ్ము లజ్ఞాత వా
స నిరాశామయ వాసరమ్ము; లిక యుష్మద్దేవదత్తస్వతం
త్రనినాదమ్ముల వేళయయ్యె; చిరనిద్రా మూఢ గాఢాంధ యా
మిను లల్లల్లన తెల్లవారెను, సమున్మీలించె ప్రాగ్భాగ్యముల్!!

ఉత్తర దిక్కునన్ కురుచమూత్కరముం గని గుండెబ్రద్దలై
తత్తరపాటుతో దిగి రథమ్ము, పథమ్మున పర్వులెత్తు న
య్యుత్తరు నొత్తిపట్టి, దిగులూడిచి, ధైర్యము సెప్పి, తేరిపై
కెత్తిన వీరహస్తము లవే! దిగజార్చెను గాండివ మ్మిటుల్!

యంత నియంతయై, విజయు నంతటి వానికి క్షాత్రధర్మ సి
ద్ధాంత ముపన్యసించు టుచితంబును ధర్మము కాదు గాని, కొం
చెంత ధనుర్ధరుండు సమయంబున చల్లగ జారిపోయి ది
గ్భ్రాంతి వహించు టెంతయు నపక్రమమౌట నుపక్రమించితిన్!!

తమ్ముల పొంగుతో నెదిరి తమ్ము నెరుంగడు రాజు; కర్ణు మీ
నమ్ములు,దుస్ససేనుని భుజమ్ములు,మామ కనుంబొమల్, మదిన్
నమ్మి రణమ్ము నెత్తికొనినాడు—మెడల్ పడి క్రుంగి శృంగభం
గమ్మగు ; తేనికిన్ దురధికార మదాంధత గెల్పునిల్పునే!

ఈ గర్వాంధుల దూపుమాపుటకె గానీ! జీతమా బత్తెమా
నీ గుఱ్ఱమ్ముల దోలునంత పనికిన్ నేనేల? మా యింటిలో
నే గుఱ్ఱాలను దోలలేనొ! నిజమింతే ధర్మరక్షార్థమై
యోగమ్మూనితి పార్థసారథి మహోద్యోగమ్ము సాగించితిన్!!

ఆకర్ణాంతవికృష్ట విశ్వవిజయోద్యద్గాండివజ్యారవం
బాకర్ణించిన మాత్ర, దుస్సహ దురన్యాయప్రభుత్వమ్ములో
భూకంపమ్ములు పుట్టు, బ్రద్దలయిపోవున్ ధూర్త దుశ్శాసన
ప్రాకారమ్ములు, క్రుంగి కూలు కురుసమ్రాట్భావనాహర్మ్యముల్!

గురు గాంగేయులతోడి పోరితము సంకోచింపగా దగ్గదే
మరి వా రేటికి మిన్నకుండక యధర్మమ్మున్ సమర్థించి ముం
దర కేతెంచిరి? భీష్మపౌత్రుడవుగాదా ధర్మ దీక్షన్, ధను
ర్ధర మూర్ధన్య! పురోగమింపుము పవిత్రక్షాత్రరక్షార్థివై!

"ఇది నీ మాతృఋణంబు" తీర్చుకొనుమోయీ! వేడిరక్తమ్ముతో!
"ఇది నీ కగ్నిపరీక్ష" దీక్ష గొనుమోయీ! క్షాత్రవిస్ఫూర్తితో!
"ఇది కర్తవ్యము" నీకు, నిల్వబడుమోయీ! కర్మవీరుండవై!
"ఇది నీ జీవిత లక్ష్య" మందుకొనుమోయీ విల్లు! శత్రుంజయా!

ఆహవ మ్మిది స్వేచ్ఛా మహా హవమ్ము;
నీవు హోత; వుప్రదష్ట నేను; స్రువము
గాండివమ్ము; విరోధి మూకలు హవిస్సు;
యజ్ఞఫలము స్వరాజ్యసంప్రాప్తి; పార్థ!

త్రిభువనమ్ము లేలు దేవేంద్రు మకుటమ్ము
తగుదు నంచు మౌళి దాల్చినావు;
సురల గౌరవమ్ము సురరాజు మరియాద
శిరసు వంచి క్రిందు సేయకయ్య!

నిలిచియున్నాడు వీరాంజనేయమూర్తి
జయము సాధింప నీ ధ్వజాంచలమునందు;
నరుడవే యిట్టులైన, వానరు డతండు
తోకజాడించి చెంగున దుమికిపోడె!

కుంతి కూరుచుండె కొండంత యాసతో
కొడుకు లేమొ ముక్తి గూర్తు రంచు;
దిక్కుమాలి యెన్ని దినములు పడియుండు
జాతివారి కన్నుసన్నలందు?

"పార్థ" శబ్దమున కపార్థమ్ము గల్గించి
వాడి సెడుట రాచపాడి గాదు ;
'ఇట్టికొడుకు' వన్న నింద్రుని సభ నున్న
పాండురాజు కింక బ్రతుకు గలదె!

దేవదత్తము పరువు, గాండీవ గౌర
వమ్ము, శ్వేతాశ్వముల మహత్త్వము, కపిధ్వ
జ ప్రతిష్ఠయు త్వత్పరాజయ కళంకి
తమ్ములై నిల్చు కవుల గ్రంథముల ముందు.

"ఇంట నిప్పువెట్టు" నీ నృశంసుల జంప
"కంట నీరువెట్టు" కరుణ చాలు,
కంట నీరు వెట్ట కాలమ్ము గా దిది
వింట బాణ మెక్కువెట్టుమోయి!

ఆత్మవిస్మృతి నంది, సంది
గ్ధాత్ముడవు గాబోకు మోయీ!
ఆత్మగౌరవ పథములో ముం
దడుగు నిడు మోయీ!

భరతవీరా ! లేవవోయీ !
పౌరుషము మేల్కొలుపుమోయీ !
"నరుడ"వోయీ నీవు ! "నారా
యణుడ" నే నోయీ !

కర్మవీరా ! నిల్వబడి, నీ
ఘర్మకణములు తుడుచుకోరా !
ధర్మమును చేపట్టి విజయ
ధ్వజము నెత్తుమురా !

# విజృంభణము

అర్జునుడు

మోహ మడంగె నో భువనమోహనరూప ! తొలంగె ధర్మసం
దేహము లన్నియున్, దిగులు దీరె, మనమ్ము కలంక దేరె, ను
త్సాహము మీఱె నెన్, విగతధర్ముడనైన నమున్ స్వధర్మ ని
ర్వాహకుగా నొనర్చిన భవత్కృప కియ్యవె ధన్యవాదముల్ !

ఉదయశ్రీ కరుణారుణారుణ నవాభ్యుత్థానముల్ పద్మినీ
హృదయమ్మున్ కదలించి జీవిత మధు ప్రేమామృతాస్వాద సం
పద పొంగించెడి రీతి, తావక మహోపన్యాసముల్ నా మదిన్
కదనోత్సాహము నూలుకొల్పె, నిలిపెన్ గర్తవ్య రంగమ్మునన్ !

ముందుకుసాగనిమ్ము రథమున్ మధుసూదన! చేత గాండివ
మ్మందితి, "సోమశేఖరునియాన" త్యజింపను! రాజు గుండియల్
కొందలమంద తద్బలము గూల్చెద, మాత కఖండసుప్రజా
నందము గూర్చెదన్, ద్రుపదనందన దుఃఖభరమ్ము దీర్చెదన్!

ఒత్తుము పాంచజన్యము! ముహుర్ముహురాకులితారి సైన్య, మే
నొత్తెద దేవదత్తము, మహోదయ! నీ దయ కల్మి నీ మదో
న్మత్తుల ద్రుంచి, ఈ దురభిమాన నితాంత నిరంకుశత్వ సం
పత్తికి స్వస్తిచెప్పి "నవ భారత వీర పతాక" నెత్తెదన్!

శ్రీ కృ ష్ణు డు

శ్రీమంతం బగుగాక భారతము! సుస్నేహార్ద్రరాజప్రజా
సామంతం బగుగాక క్షాత్రము! సముచ్ఛ్రేశ్శాంతి సీమంతినీ
సీమంతం బగుగాక సృష్టి! విజయశ్రీ, క్రాంతి సంక్రాంతికిన్
హేమంతం బగుగాక నవ్య యుగ సందేశ ప్రభావంతమై!

ఇ తి శ్రీ

# అనుక్రమణిక